# అలీ,
# మహిమగల చారు





చాలా రోజుల నాటి సంగతి. ఇరాన్‌లో అలీ అనే ఒక పిల్లవాడు ఉండేవాడు. అతడి తండ్రి బాగా డబ్బున్న వ్యాపారి. అతని తల్లి అందంగా ఉంటుంది, అంతకు మించి దయాళువు. అలీ వాళ్ల ఇల్లు రాచమహలులాగా ఉంటుంది. అందమైన నీటి గుమ్మటాలు, మడుగులు ఉండేవి. అతడికి అక్క, చెల్లెళ్లు, అన్న, తమ్ముళ్లు లేకపోవటంతో అమ్మా, నాన్నలు అతడిని బాగా గారాబం చేశారని అందరూ అంటారు.

ప్రపంచంలో కోరుకోదగినవన్నీ అలీ దగ్గర ఉన్నాయి. అందుకే అతడు గర్విష్ఠి, స్వార్థపరుడిగా మారాడు...

"ఈ ద్రాక్షపళ్లు నాకు ఏమాత్రం బాగా లేవు!" అంటూ అతడు వాటిని విసిరేశాడు. అతడు మంచం మీద కాళ్లు జాపుకుని కూర్చుని ఉన్నాడు. అతడి భుజం మీద చిన్న, నల్ల కోతి ఉంది. "నా కోతి లైలాకి కూడా ఈ ద్రాక్షపళ్లు నచ్చలేదు. మన ఇంటి బయట ఉండే బిచ్చగాళ్లకి ఇవి సరిపోతాయి!"

అదే సమయానికి అతడి అమ్మా, నాన్నలు ఆ గదిలోకి వచ్చారు. అలీ మనసులో ప్రేమ అన్నది ఉంటే అది అమ్మా, నాన్నల పట్లే.

"ఏం మాటలు ఇవి?" అలీ వాళ్ల నాన్న అన్నాడు. "మనుషులను అలా చూడకూడదు." అతడి తల్లి అతని రెండు బుగ్గల మీద ముద్దు పెట్టింది.

"నాన్నా, ఈ ద్రాక్ష పళ్లు కుళ్లిపోయాయి," అంటూ తండ్రి మెడను కావిలించుకున్నాడు అలీ. "మన ఇంటి ముందు గుమిగూడే అడుక్కునేవాళ్లకు ఇవి ఇచ్చెయ్యి."

ఆ తరవాత తండ్రి చెంపలు నిమురుతూ, "ఆ అడుక్కునే వాళ్లను అసలు మన ఇంటికి ముందుకు ఎందుకు రానిస్తావు?"

అలీ చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అతడి తల్లి చెప్పింది, "పేదలు, వికలాంగులు, ఇల్లులేనివాళ్లు, ఆకలిగొన్నవాళ్లను ఒక మంచి ముస్లిం ఆదరించాలి. అడుక్కునేవాళ్లు కూడా ఇలాంటి వాళ్లే."

"మనం ఇచ్చింది తీసుకుని వాళ్లు మనల్ని దీవిస్తారు. వాళ్లు మన ఇంటికి రాకుండా వెళ్లగొట్టను. నీకు ఒక విషయం చెబుదామని వచ్చాను," అన్నాడు అతడి తండ్రి.

నాన్న వేసుకున్న బట్టలు చూసి అతడు దూర ప్రయాణం మీద బయలుదేరుతున్నాడని అలీకి అర్థమయ్యింది. "నాన్నా, ఎక్కడికి వెళుతున్నారు? అమ్మా, నాన్నకి వెళ్లవద్దని చెప్పవా. నాకు ఒంటరిగా అనిపిస్తుంది." అమ్మ ఏమీ మాట్లాడలేదు. నాన్న వెళ్లటం అమ్మకి కూడా ఇష్టం లేదని అలీకి అర్థమయ్యింది.

"కొద్ది రోజులలోనే నేను తిరిగి వస్తాను. నేను లేనప్పుడు అమ్మను జాగ్రత్తగా చూసుకో. నీ కోపాన్ని కూడా తగ్గించుకోవాలి. చెడు ప్రవర్తన నీకు మంచిది కాదు!"



ఆ సాయంత్రం అలీ వాళ్ల అమ్మతో మహలు ప్రాంగణంలో నుంచుని ఉన్నాడు. వాళ్ల నాన్న తెల్లటి గుర్రం ఎక్కి, ముగ్గురు నౌకర్లతో ప్రయాణం అయ్యాడు. గుర్రం మీద సుగంధ ద్రవ్యాలు, రత్నాలు, కెంపుల సంచులు ఉన్నాయి. అయితే, రెండు రోజులలోనే వాళ్ల నాన్న తిరిగి వచ్చాడు. అతడికి తీవ్రమైన జ్వరం ఉంది, వళ్లంతా నొప్పులు.



పేరుమోసిన వైద్యులు ఎందరో వ్యాపారిని చూశారు. ప్రతి ఒక్కరూ ఏదో కొత్త మందు చెప్పారు. కానీ ఏదీ అతడి జ్వరాన్ని తగ్గించలేదు.

అలీ వీపుకి అతుక్కుని ఉండే కోతి అతడు ఏడుస్తుంటే కన్నీళ్లు తుడిచేది.

"రాత్రి, పగళ్లు తండ్రి పక్కన కూర్చుని నీళ్లతో ఒంటిని అమ్మ తుడుస్తూ ఉంటుంది. అమ్మకి మనం ఏ విధంగా సహాయపడగలం?"

చప్పుడు చేయకుండా నాన్న ఉన్న గదిలోకి వెళ్లాడు అలీ. "రా, అలీ," అంటూ అమ్మ పిలిచింది. నాన్న మంచం మీద పడుకుని ఉన్నాడు.

"నాన్నకి జ్వరం చాలా తీవ్రంగా ఉంది," అమ్మ గుసగుసగా చెప్పింది. "ఏమీ తినటం లేదు, తాగటం లేదు. ఏదో కలవరిస్తున్నాడు, కానీ ఆయన చెప్పేది ఒక్క మాట కూడా అర్థం కావటం లేదు."

నాన్న దగ్గరకు వెళ్లాడు అలీ. "నాన్నా, మీరు ఏమైనా చెప్పాలని అనుకుంటున్నారా?" జబ్బుగా ఉన్న తండ్రి చెయ్యి ఎత్తటానికి ప్రయత్నించాడు, కానీ అతడి వల్ల కాలేదు.

అతడు లోగొంతులో, "కం... కం... చారు," అంటూ ఏదో గొణిగాడు.



అమ్మ దగ్గరికి పరిగెత్తిన అలీ కళ్లు మెరుస్తున్నాయి, "అమ్మా, నాన్న కందిపప్పు చారు కావాలని అంటున్నట్లు ఉంది. అదంటే ఆయనకి ఇష్టమా?"

"అదంటే నాన్నకి ఇష్టమే," అమ్మ సందేహంగా చెప్పింది. "అయితే ఆ చారు కంటే మాంసం వేపుడు, క్షీరాన్నం, తేనెలో ముంచిన అట్టు చాలా ఇష్టం."

నాన్న దగ్గరికి వెళ్లి అలీ అడిగాడు, "మీరు కందిపప్పు చారే అడిగారు కదూ?" అది విన్న నాన్న మెల్లగా తల ఊపినట్లు అలీకి అనిపించింది.

అది చూసి అలీ వెంటనే వంట ఇంటిలోకి పరిగెత్తాడు, "తొందరగా కందిపప్పు చారు చెయ్యి," అంటూ వంట మనిషిని ఆదేశించాడు. "నాన్న కావాలని అడుగుతున్నాడు!"

"మన్నించు బాబు," వంటమనిషి అన్నాడు, "దానికి కావలసిన కందిపప్పు, ఇతర దినుసులు ఉన్నాయి కానీ తాజా కొత్తిమీర లేదు."

"అయితే వెళ్లి తీసుకుని రా!" కాళ్లు తపతపలాడిస్తూ అన్నాడు అలీ.

"వంటలో సహాయం చేసేవాళ్లు ఎవ్వరూ ఇవ్వాళ రాలేదు. అమ్మగారి కోసం ఇప్పుడే నేను వంట మొదలుపెట్టాను కాబట్టి నేను వెళ్లలేను," తల వంచి అన్నాడు వంటవాడు.

"ఏం పర్వాలేదు, నేనే వెళ్లి తీసుకుని వస్తాను," అంటూ అలీ కోపంగా గదిలోంచి బయటకు వెళ్లాడు.



అలీ తన గదిలోకి వెళ్లి కొన్ని నాణాలు తీసుకుని తన పట్టు పైజామాలో వేసుకున్నాడు. తరవాత పరిగెత్తుతూ మహలు బయటకు వెళ్లాడు. అక్కడ ఒక బిచ్చగాడి బొచ్చెకు తగిలి కింద పడిపోయాడు. "పందీ!" అలీ అరిచాడు. అతడి మోకాలు కొట్టుకుపోయి రక్తం కారుతోంది. గట్టిగా ఊపిరి పీల్చి తలుపు పట్టుకుని లేచి నిలబడ్డాడు. ఆ సమయంలో అతడి చెయ్యి బిచ్చగాడి భూజానికి తగిలింది.

"మెల్లగా లే, అలీ," సంగీతంలాంటి స్వరంలో ఆ బిచ్చగాడు అన్నాడు. అలాంటి స్వరం అలీ అంతకు ముందు విని ఉండలేదు. "దుకాణాలు కట్టెయ్యటానికి ఇంకా సమయం ఉంది."

అది విన్న అలీ ఆశ్చర్యచకితుడయ్యాడు. "నేను బజారుకి వెళుతున్నానని నీకు ఎలా తెలుసు!" అతడి స్వరంలో ఇంకా కోపమే ఉంది. "నాకు అన్నీ తెలుసు," బిచ్చగాడు మెల్లగా అన్నాడు. "మీ నాన్న కందిపప్పు చారు అడిగాడని కూడా నాకు తెలుసు. దాని వల్ల అతడి జబ్బు నయం అవుతుందని కూడా నాకు తెలుసు. అయితే, దానికి కావలసిన సరుకులు అన్నీ బిచ్చమెత్తిన డబ్బులతో కొనాలి."

"నేను రోడ్డు మీద అడుక్కోవాలా!" అలీ కోపంగా అన్నాడు. "నీ దగ్గర ఉన్న నాణాలు ఇచ్చెయ్యి. వాటికి బదులు నేను బంగారు నాణాలు ఇస్తాను."

"చూడు అలీ, కుటుంబంలోని వాళ్లు బిచ్చమడిగిన డబ్బుతో సరుకులు కొని చారు చేస్తేనే అది పని చేస్తుంది," చెప్పాడు బిచ్చగాడు.



"మా నాన్న పెట్టే అన్నం తిని బతికేవాడివి నువ్వు. నీ మాటలు నేను నమ్మను," అన్నాడు అలీ.

"నా మాటలు వినాలని ఏమీ లేదు, అలీ. కానీ మీ నాన్న జబ్బు తగ్గాలని ఉందో లేదో ఆలోచించుకో," బదులు ఇచ్చాడు బిచ్చగాడు.

అతడి మాటలు కోతి నమ్మినట్టు ఉంది, అది అలీ పైజామా పట్టుకుని లాగుతోంది.

బిచ్చగాడిని అసహ్యించుకున్నప్పటికీ తండ్రి కోసం ఆ పని చెయ్యాలనుకున్నాడు అలీ. తండ్రికి జ్వరం తగ్గితే తల్లి ముఖం మళ్లీ ఎప్పటిలా వికసిస్తుంది.

"నేను బిచ్చమడుగుతాను," అంటూ అలీ తన బట్టలు సరిచేసుకున్నాడు. "నేను అడగటం ఆలస్యం ఎవరైనా డబ్బులు ఇస్తారు."

అలీ పైజామా పట్టుకుని బిచ్చగాడు అతడిని ఆపాడు. అలీ గింజుకున్నా అతడు వదిలిపెట్టలేదు. "నువ్వు బిచ్చగాడి బట్టలు వేసుకుని, బొచ్చె పట్టుకుని, తల వంచుకుని అడుక్కోవాలి," బిచ్చగాడు చెప్పాడు.

అలీ తల అదురుతోంది. సమయం వృథా కాకుండా అతడు తన విలువైన బట్టలు విప్పేశాడు. ముసలి బిచ్చగాడు కూడా అంతే వేగంగా తన పాత దుప్పటి తీసి అలీకి ఇచ్చాడు. తలపాగా, తన బట్టలు బిచ్చగాడి దగ్గర ఉంచి ముఖానికి మట్టి పూసుకున్నాడు అలీ.

బిచ్చగాడి దుప్పటి చుట్టుకుని, లైలా కోతిని భుజాన వేసుకుని బిచ్చమడగటానికి అలీ బయలుదేరాడు.



అలీ హృదయం మెలిపెడుతోంది. దారిన పోయేవాళ్లతో చూపు కలపకుండా, తల వంచుకుని చెయ్యి చాచి బిచ్చం అడగసాగాడు. ఖరీదైన బట్టలు వేసుకున్న భార్యా, భర్తల దగ్గరకు వెళ్లి, "జాలి చూపండి! మా నాన్న జబ్బు చేసి చనిపోయేటట్టు ఉన్నాడు. అతడి ఆరోగ్యం కోసం కొంచెం దానం చెయ్యండి. అల్లా మిమ్మల్ని చల్లగా చూస్తాడు," అని అన్నాడు.

ఇద్దరూ అతడి వైపు ఛీత్కారంగా చూశారు. అయితే, మహిళ తన సంచి నుంచి ఒక నాణాన్ని అతడి బొచ్చెలో వేసింది. కానీ ఆమె భర్త అలీని తోసివేయడంతో అతడు కిందపడ్డాడు, నాణెం కూడా కింద పడిపోయింది.

"నాన్న చనిపోతున్నాడా! అడుక్కోటానికి కొత్త, కొత్త అబద్ధాలు మొదలుపెట్టారు!"

బొచ్చెని, నాణాన్ని లైలా తీసి ఇచ్చింది. అతడి చెక్కిళ్ల వెంట కన్నీళ్లు కారుతున్నాయి. ఒక మెత్తటి పంజా వాటిని తుడిచింది. "సరే, లైలా. చారుకి అవసరమయ్యే దినుసులకు సరిపడా డబ్బులు మనం అడుక్కోవాలి. కానీ, మనుషులు ఇంత క్రూరంగా, జాలి లేకుండా ఎలా ఉంటారు? చిరిగిన బట్టలు వేసుకున్నా నాకు కూడా మనస్సు ఉంటుంది కదా."



బిచ్చగాడి దుప్పటిని ఒంటికి మళ్లీ గట్టిగా చుట్టుకుని అలీ బిచ్చం అడగ సాగాడు. సూర్యుడు కుంగబోతున్నాడు, అతడి కాళ్లు కూడా నొప్పి పెడుతున్నాయి. ఇతరులు అతడిని, “పనిదొంగ,” “మురికి కూపం,” “దరిద్రుడు,” అంటూ తిట్టారు. చీకటి పడింది. ఆపాటికి అతడి బొచ్చెలో సరిపడా నాణాలు పడ్డాయి. దినుసులు కొంటుంటే అలీ చేతులు వణికాయి. కోతి అతడిని అంటిపెట్టుకునే ఉంది. ఆ సరుకులను గుడ్డలో మూటకట్టుకుని తన ఇంటి వైపు పరుగు తీశాడు.



బిచ్చగాడు అక్కడే ఉన్నాడు. అతని పక్కనే అలీ తలపాగా, బట్టలు ఉన్నాయి. అలీ ఒక్క క్షణం ఆగి ఊపిరి తీసుకున్నాడు. “నువ్వు చెప్పినట్లే నాన్నకి జ్వరం తగ్గాలను కోరుకుంటున్నాను, తాతా,” అలీ మెల్లగా అన్నాడు. “నేను పేదవాడిని అనుకుని, అడుక్కుంటున్నానని అనుకుని ప్రజలు నన్ను ఎంత చీదరించుకున్నారు, ఎంత కసురుకున్నారు...”

అతడి మాటలు మధ్యలోనే ఆగిపోయాయి.

బిచ్చగాడు ఒక కన్ను తెరిచి, “బిచ్చమెత్తిన డబ్బులతో కొన్న దినుసులతో తొందరగా చారు కాయించు, అలీ,” అన్నాడు.

అలీ పరిగెత్తుకుంటూ వంటింటిలోకి వెళ్లాడు. అతడి బట్టలు చూసి ఎవరో అనుకుని తరిమేసేటంత పని చేశాడు వంటవాడు. తరవాత అతడు అలీ అని తెలుసుకున్నాడు. చారు త్వరగా కాయమని అలీ మర్యాదగా అడగటం చూసి వంటవాడే కాదు అక్కడున్న అందరూ ఆశ్చర్యపోయారు.







తరవాత వేడి, వేడి చారుతో నాన్న గదిలోకి వెళ్లాడు అలీ.

అతడి చిరిగిన బట్టలు, దుమ్ము కొట్టుకున్న ముఖం చూసి అమ్మ ఆశ్చర్యపోయింది. నోటి మీద వేలు వేసుకుని ఏమీ మాట్లాడవద్దని అలీ సైగ చేశాడు, "నీకు అన్ని విషయాలు తరవాత చెబుతాను, ముందు నాన్నని చారు తాగనివ్వు."

నాన్న తలని అమ్మ పైకి లేపి పట్టుకుంది. అలీ అతడి దగ్గర కూర్చున్నాడు. "కొంచెం చారు తాగండి," అంది అమ్మ. అలీ గరిటతో చారు అందించాడు.

"నాన్నా, ఈ గరిట నా కోసం, ఇది అమ్మ కోసం, ఇది లైలా కోసం, ఇది మీ కోసం," అంటూ చారు తాగించాడు అలీ. తరవాత తన మనస్సులో, 'బిచ్చగాడు చెప్పినట్టు నాన్నకి జ్వరం తగ్గాలి. అతడు కోరుకున్నది ఇస్తాను. గడిచిన కొద్ది గంటలలో నేను చాలా నేర్చుకున్నాను. నేను...'

"అలీ!" అమ్మ సంతోషంతో అరిచింది. "మీ నాన్న ముఖం చూడు. పాలిపోయిన బుగ్గలలో ఎరుపుదనం వస్తోంది." నిజమే. నాన్న తేలికగా ఊపిరి తీసుకుంటున్నాడు. కనురెప్పలు కదులుతున్నాయి, అతడి ముఖం మీద చిరునవ్వు దోగాడింది. కొంచెం సేపటికి అతడు కళ్లు తెరిచాడు. సంతోషంతో అలీ చెయ్యి వణికింది.

"మిగిలింది నేను తాగిస్తాను," అంటూ అలీ చేతిలోంచి గిన్నెను అమ్మ తీసుకుంది. "నువ్వు వెళ్లి శుభ్రంగా వళ్లు కడుక్కో. ఆ మురికి బట్టలు పారెయ్యి. అవి నీకు ఎక్కడ దొరికాయి?"

"వద్దు, బిడ్డా," అలీ వాళ్ల నాన్న అన్నాడు. అతడి మాటలు స్పష్టంగా ఉన్నాయి. "ఈ చిరిగిన బట్టలు పారెయ్యవద్దు. దయగల హృదయం జవం, జీవం, సంతోషాలను ఇస్తుందని ఈ బట్టలు నీకు గుర్తు చేస్తాయి."



"ఈ పాఠం ఎప్పటికీ మరిచిపోను, నాన్నా," అంటూ అతడి చేతిని ముద్దుపెట్టుకున్నాడు అలీ. గదిలోంచి పరిగెత్తి మహలు బయటకు వెళ్లాడు. అక్కడ ఉన్న తాత కాళ్లకి దండం పెట్టి, "నీ చిరిగిన దుప్పటి నేను ఉంచుకోవచ్చా? బదులుగా నీకు మా నాన్న మంచి బట్టలు, కోరుకున్నంత డబ్బు ఇస్తాడు."

పక్కనున్న కర్ర పట్టుకుని తాత అతి కష్టం మీద లేచి నిలబడ్డాడు. "దీనిని ఎన్నటికీ నీ దగ్గరే ఉంచుకో, అలీ. జాలి చూపకపోవటం వల్ల ఎంత బాధ కలుగుతుందో ఆ దుప్పటి నీకు గుర్తు చేస్తూ ఉంటుంది. నీ బట్టలు కూడా తీసుకుని వెళ్లు. మీ నాన్న బహుమతులను తీసుకుంటానని అతడికి చెప్పు."

అతడు నిలబడటానికి అలీ సహాయం చేశాడు. "తాతా, ఎక్కడికి వెళుతున్నావు? నువ్వు ఇక్కడే ఉండాలి."





“ఇప్పుడు నేను వెళుతున్నాను, కానీ ఎప్పటికీ ఇక్కడే ఉంటాను,” తల ఊపుతూ అన్నాడు తాత. అతడి ముఖంలో నవ్వుల ముడతలు విచ్చుకున్నాయి. “నేను ఉంటున్నాను, వెళుతున్నాను. మీ నాన్న ఆరోగ్యవంతుడు అవుతాడు. మీ అమ్మ బుగ్గలలో మళ్లీ గులాబీలు పూస్తాయి.”

“ఇక నువ్వు...” అలీ నుదుటిని తాకుతూ చెప్పాడు తాత, “ఇప్పుడూ, వాళ్ల ముసలితనంలోనూ మీ తల్లిదండ్రులు గర్వపడేలా ఉంటావు.” ఆ మాటలతో తాత చీకటిలోకి కరిగిపోయాడు.



